భగవద్ధ్యానము చేయువాడే యోగి. యోగి అయినపుడే భవబంధవిమోచనము గల్గును. అనగా ధ్యానము ద్వారా స్వస్వరూపసాక్షాత్కారము కలుగు నపుడు జీవుడు ముక్తినొందును. కావున అట్టి మహోన్నత యోగపదము నధిష్ఠించి సర్వులును తరించవలయును.

**ప్ర:–** యోగి యెట్టివాడు?

**ఉ:–** అతడు (1) తపస్వులకంటెను (2) శాస్త్రజ్ఞానులకంటెను (3) కర్మనిష్ఠులకంటెను గొప్పవాడు.

**ప్ర:–** కావున భగవాను డర్జునున కేమని దెల్పెను?

**ఉ:–** 'నీవు యోగివికమ్ము' అని బోధించెను.

**అ॥** యోగులలో నెవడు శ్రేష్ఠుడో వచించుచున్నాడు –

## 47. యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా
## శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

**టీక:–** సర్వేషాం యోగినామ్ అపి = యోగులందఱిలోను, యః = ఎవడు, మద్గతేన = నా యందు నిలువబడిన, అంతరాత్మనా = మనస్సుతో, శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడై, మామ్ = నన్ను, భజతే = సేవించుచున్నాడో (ధ్యానించుచున్నాడో), సః = అతడు, యుక్తతమః = మిక్కిలి శ్రేష్ఠుడని, మే మతః = నాయభిప్రాయము.

**తా:–** యోగులందఱిలోను ఎవడు నాయందు మనస్సును నిలిపి శ్రద్ధతో నన్ను ధ్యానించుచున్నాడో అట్టివాడు సర్వశ్రేష్ఠుడని నా యభిప్రాయము.

**వ్యాఖ్య:–** ప్రపంచమున అందఱికంటెను యోగులు ఉత్తములని క్రిందటి శ్లోకమున చెప్పబడినది. ఆ యోగులలో నెవడు సర్వశ్రేష్ఠుడో ఇచట తెలుపుచున్నాడు. అత్యంత శ్రద్ధగలిగి అంతరాత్మయందే మనస్సును నిలిపి అట్టి పరమాత్మనే ధ్యానించువాడు యోగులలో సర్వోత్తముడని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చిరి. శ్రీకృష్ణుడు చరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళములందు వెలుగొందు సాక్షాత్ పరమాత్మయే కనుక, 'నా యందు మనస్సును నిలుపుము' అను వాక్యముయొక్క అర్థము హృదయసాక్షియగు అంతరాత్మయందు చిత్తమును సంలగ్న మొనర్చుమనియే యగును. లేక శ్రీకృష్ణమూర్తి యొక్క సగుణరూపమునైనను భక్తులు సేవించవచ్చును. ఎట్లున్నను, మనస్సునందలి వాసనాదోషములుతొలగి, ధ్యేయవస్తువగు పరమాత్మయందు లయించి జీవుడు ఆత్మమాత్రుడై శేషించుటయే ముఖ్యము. అదియే యోగము. అద్దాని నాచరించువాడే సర్వశ్రేష్ఠుడగు యోగి. 'యోగులందఱిలోను' అని చెప్పినందువలన కర్మయోగముగాని, ధ్యానయోగముగాని, జ్ఞానయోగముగాని – దేనినను సరించువారైనను వారిమార్గమునందు భక్తిని జోడించినపుడే చక్కనిఫలితముల నీయగలవు. ఈభావమే యిచట తెలుపబడినది. ఏ విత్తనమైనను నీటిలో తడిపినపుడేకదా మొలకెత్తును. అట్లే భక్తియను జలములో గూడినపుడే ఏ మార్గమైనను లెస్సగ ఫలించగలదు. భీషణమాయావిజయకార్యమున సాధకునకు భగవదనుగ్రహములేనిదే విజయము దుస్తరము. కనుకనే మహనీయ లెల్లరును ఏ మార్గము ననుసరించినను భక్తినిమాత్రము ఆశ్రయించియే తీరుదురు. గీతయందు దాదాపు ప్రతి అధ్యాయమందును ఎక్కడనో ఒకచోట ఈభక్తినిగూర్చి భగవానుడు నొక్కి చెప్పుచునేయుందురు.

'శ్రద్ధావాన్' - అని చెప్పుటవలన సాధకుడు అత్యంతశ్రద్ధగలిగి భగవంతుని సేవింపవలెనని స్పష్టపరుపబడినది. ఈ శ్రద్ధనుగూర్చి గీతాచార్యులు తన ప్రసంగమున అనేక చోట్ల నొక్కి చెప్పుట గమనించదగినది. అశ్రద్ధతో చేసినకార్యము చేయనిదానితో సమానమే అనియు ఒకచోట మున్ముందు చెప్పెదురు (17-28). శమదమాదిసాధనలలో శ్రద్ధ అనునదికూడ ఒకటి చేర్చబడియున్నది. కాబట్టి సాధకుడు అతిశ్రద్ధాళువై భగవంతుని ధ్యానించవలెను. 'మద్గతేన' అనుటవలన మనస్సును అన్యత్రపోనీయక ఆత్మయందే నెలకొల్పవలెనని సూచింపబడినది. అట్లు శ్రద్ధతో దైవమును ధ్యానించువాడు మహాశ్రేష్ఠుడు (యుక్తతమః) అని చెప్పుటవలనను (ఇచట 'తమ' ప్రత్యయము చేర్చబడుట గమనించ దగినది), 'ఇది నానిశ్చితాభిప్రాయము' అని భగవానుడు తెలుపుటవలనను, భక్తితో గూడిన అట్టి ధ్యానమం దెట్టి మహత్తుకలదో తేటతెల్లమగుచున్నది. ప్రాపంచిక జనుల దృష్టిలో గొప్పవాడు అనిపించుకొనినంతమాత్రమున చాలదు. భగవంతుని దృష్టియందు 'వీడు గొప్పవాడు' (యుక్తతముడు) అనిపించుకొనవలెను. అట్టి స్థితియో, శ్రద్ధతోగూడిన పరమాత్మధ్యానమువలననే చేకూరగలదని యిచట స్పష్టముచేయబడినది. కావున అద్దానిని ముముక్షువు తప్పక ఆశ్రయించి భగవత్కటాక్షమునకుపాత్రుడై తరించవలయును.

**ప్ర:-** యోగులందఱిలోను భగవంతునిదృష్టిలో ఎవడు సర్వశ్రేష్ఠుడు?

**ఉ:-** (1) మిగుల శ్రద్ధతోగూడినవాడు (2) లక్ష్యమగు ఆత్మయందు, లేక శ్రీకృష్ణునియందు మనస్సును సంలగ్న మొనర్చువాడు (3) అట్టి పరమాత్మనే నిరంతరము ధ్యానించువాడు సర్వోత్తమయోగియగును.

ఓమ్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగో నామ

షష్ఠోఽధ్యాయః

ఇది ఉపనిషత్ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,

శ్రీ కృష్ణార్జున సంవాదమునగు శ్రీ భగవద్గీతలందు ఆత్మసంయమయోగమను

ఆఱవ అధ్యాయము

ఓమ్ తత్ సత్

